# రాధాధవ శతకము



కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి
ఘుట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

# అభ్యర్థన

కం. శిష్టేష్టతనూజకలా
హృష్టము లమలరసపుష్టిమృష్టములు యశో
జుష్టము లనుపమవిభవవి
శిష్టము లలరుత ధరిత్రి శిష్టాన్వయముల్.

శా. శ్రీనంద్యాలప్రథమానసద్గుణకనత్సీమంతినీదుర్లభా, సూన
ప్రాభవ సోమమాంబ యస్మద్గుం దోడై సుఖ మిమ్మాయ
ల, శ్రీమన్నారాయణసేవ్యమాన పదరాజీవద్వయుండై
యశః, శ్రీ నింపొప్పిన శాయనాఖ్యసుధి యర్థిన్
మాకు సంస్మార్యుండై.

సీ. త్రివిధఫలప్రద త్రిపురమాలిని యేమ
హోమహూనకు నిరతార్చ్యచరణ,
నిగమగోచరకలానిరుపమ గాయత్రి
స్థిరయశుఁ డేవాని జేబుడబ్బు,
ధరణిజాధవుండు కోదండరామవిభుండు
స్తుత్యుఁ డేఘునునకుఁ దోసునీడ,
తత్త్వమయానిలాత్మజ పరబ్రహ్మన్న
పేర్పుకూర్మి నెవాని కూర్చు బ్రాపు,

పలుకుబడిదారు లితరదైవతవిశేష
ములు బలమ్ములతోడ నైపుణ్యమతికి,
నా ప్రథితలంకపల్ల్యగ్రహారవాస
రతుఁడు శాయనశాస్త్రి విస్తృతగుణుఁడు.

గీ. భవ్య మాత్మనామాంచితప్రథిత మీశ
తకము రకమున రాధికాధవుఁడు తనరు
దయఁ దదన్వయ మాచంద్రతారకముగ
నవయశస్స్ఫూర్తి మెఱయ నొనర్చుఁగాత.

గీ. తన్మాతనూజామృదుమనశ్శిఖావళాభి
నవఘనము రామవిభుకరుణారసార్ద్ర
దృష్టినాసుధావృష్టి నభీష్టపూర్తి
బీజతతి మోసులెత్తి శోభిల్లుఁగాత.

కొల్లూరు,
౨౮-౬-౩౯.

ప్రభాకరశాస్త్రి
(జామాతృఁడు)

ఓం

# రాధాధవ శతకము

---

మ. కలధౌతాంబర, శంబరప్రభవభూకాంత్యాయనీనాథను,
త్యు, లసత్కాలవిలాహానీలతను, శుక్లాపాంగపింఛావతం
స, లతాంతాస్త్రసహస్రసుందర, మునీశస్తోమభూమా
ర్చనా,కలనాగమ్య, యగమ్య, రమ్యతరపత్కంజాత,
రాధాధవా !

మ. గడియించెన్ రచియించి మించి మును సంఖ్యావత్ప్ర
కాండౌఘు మెక్కుడుగా లెక్కకు హృద్యముల్ శతక
ముల్ కుంతమ్మకానట్టి పే, రుతుంగంబోని యశమ్ము; నీతి
గతి భక్త్యుద్రేకముల్ సర్వముం, గడముట్టం బ్రకటించి
యవ్వి యలరంగా నోపు రాధాధవా !

మ. అటు తద్వర్ణితమైనకారణముచే నాపీతసారాన్వితం,
బటు రాజిల్లెడి నిప్డు సర్వ; మవుచో నాచాయ, నింకన్
మఱో,క్కటి కూర్పం బనియే హుళక్కి; యయినం
గాంక్షింతు నిర్మింప; నెచ్చట నేనిన్ విలసిల్లుచో
గొసఁగదే సారంబు రాధాధవా !

మ. కనరా దేయెడ నీదుపాదయుగకైంకర్యంబ కన్దోయికిన్;
వినరా దేయెడ వీనులన్ విమలమౌ నీనామగానంబ;
పేర్కొనరా దేయెడ నీమహామహిమ నేరున్ నే[illegible];
పాఖండదుర్జనసంకీర్ణమమై ధరాతలము భ్రష్టంబయ్యె
రాధాధవా!

మ. అమల, మ్నాయత, మాజవంజవదవాగ్న్యాసార,
మజ్ఞత్వాంధతమస్సహస్రమతిగ్మరశ్మిరుచి, యుద్దామాఘ
మేఘాశుగంబు, మహామౌనివరాన్వహార్ఘ్యము, సురే
ట్పూజ్యంబు, నీపాదపద్మ మదే ప్రార్థని మాదుతాప
సమితిన్ మాయించు రాధాధవా!

మ. పోరి నాశామృగతృష్ణఁ దృష్ణఁ జని యేపుంజూపు
తాపంబునన్, స్మరదుర్దాంతకిరాతమార్గణహతిన్ సంసా
రమున్ ఘోరమౌ, మరుభూమిం బడి స్రుగ్గి మ్రగ్గి
చెడనో మర్త్యగణసంఘంబు నీకరుణంగాదె విపత్తులెల్లఁ
గడువంగాఁబోక రాధాధవా!

మ. జలజాతాత్ములచూపుతూపుగమిచే సంవిద్ధమై తప్త
చిల్లులుప్రోవన్ నిజధైర్యకంచుకము గోల్పున్ గుడ్వఁగా
నొచు నిచ్చలు నవ్వారిపదార్చనాభిరతి నష్టభ్రష్టులై
కూలు మర్త్యులకుం దారక మెన్న నీసుభజన
మ్మొక్కండె రాధాధవా!

మ. కశలన్ మోదుచు భీమపాశవితతిన్ గాల్సేతులం బట్టి
కట్టి శిర మ్మట్టె విభిన్నమై చెదరునట్లే కొట్టుచుం
దిట్టుచుం, బహుజీవంబుల నీడ్చికొంచుఁ జనున ప్పాశ్యు
ద్భటశ్రేణిఁ ద్వా,ద్వాశగస్వాంతుఁ డావేళ నేనిఁ దిలకింపం
బోఁడు రాధాధవా!

మ. పరఁగన్ వార్ధిమహావైన, మీనువయియున్, వారాహ
మైనన్, నృకేసరివైనం, గమఠంబవైన, వసుధిస్ఫారో
ర్ములన్ డాగినం దరుణీయుక్తుండవై త్యజింప, నిను
మత్స్వాంతోరువార్యర్గళం, బరువుం జూడక భక్తిరజ్జు
వులచే బంధింతు రాధాధవా!

మ. అతిపారంబు భవంబుపేరిటి మహోగ్రాంభోనిధిన్ మున్గు
నన్, సతిపేరింటిద గ్రాహమొక్కఁ డిదె కిన్కం బట్టెఁ
బాదంబులన్, గతమయ్యెన్ జవమున్ సమస్తము,
నిఁకన్ గావింపుమా మత్సముద్ధృతి మాతంగసమర్చ్యా!
కూర్మిమెయి నార్తిం బాపి రాధాధవా!

మ. సుర సిద్ధోరగసాధ్య మౌనివర రక్షోభూతయక్షాప్సరో
నరవిద్యాధర కిన్నరాదినుతమున్, దంభోళిచక్రాంక
సుందరమున్, గిల్బిషపంకశోషణము, నిర్ణాశాఽవ
నర్గప్రదం, బరుణాబ్జాతనిభంబు, నీపదయుగం బర్చింతు
రాధాధవా!

శా. రాగద్వేషము లందనీక, సుజనవ్రాతంబులం దూరఁ
బోఁ, గాఁ గోర్కెం గననీక, యన్యధనముం గాంక్షిం
పఁగానీక, దుర్భోగాసక్తి జనింపనీక, ఖలులం భాషిం
పఁగానీక, యో నాగాధీశఫణాశయాన, సతముం నన్
బ్రోవు రాధాధవా!

శా. ప్రాణంబుల్ భరియింప నీచజనులం బ్రార్థింపఁగాఁ
బోను, నా పాణుల్ జాపను దేహీయంచు నెపుడుం
బాఖండులం డాసి, యేఁ బ్రాణంబుల్ మెయిఁ బాయ
కుండుదనుకన్ బ్రార్థింతు నిన్నే మదిన్, మాణిక్యాం
చితహార! యియ్యదియ నామార్గంబు రాధాధవా!

శా. దారాపత్యరతుల్, త్వదీయచరణధ్యానప్రభావర్జితుల్,
మారావేశవశంగతుల్, ఖలమతుల్, మాత్సర్యసంవేష్టి
తుల్, సారాచారవిచారదూరులు నరుల్ సంసార
దుష్పారపాథోరాశిం దరియింపఁబోక దెస యెంతో
కాంత్రు రాధాధవా!

శా. కాయంబందున సత్వముండుదనుకం, గర్మిష్ఠు
డున్నప్పు, డా దాయం బంతయుఁ జేత నున్నతఱి నీ
దారాసుతుల్ జేరి నిన్, బాయంజాల మటంచు రన్ని
యుండగన్ మాటాడరా రెవ్వరున్, సాయంప్రాతముఁ
గుండుచున్న గొడవన్ సత్యంబు, రాధాధవా!

శా. ధన్యంమన్యనరాధమాధములకున్ దాస్యంబు గావించి
నన్, ధన్యంబౌనె మదీయజన్మ భువి? నోదాసౌఘ
మందార! నే, నన్యమ్మొం డెఱుఁగన్ భజింతు
భవదీయాంఘ్రిద్వయ మ్మెప్పుగా, ధన్యుం జేయవె
నారదాదిమునివంద్యా, నన్ను రాధాధవా!

మ. తమిమీఱన్ గలనేనియున్ నిజమహద్గాథాఖ్యపీయూ
షసా,రముపాన మ్మొనరింపనేరువని నిర్భాగ్యుం డెనాఁ
డేని భక్తి మదిన్ నీపదపద్మముల్ దలఁచుచో దీర్ఘాను
కంపారసా,ర్ద్రము దృష్టిం బొనరింతు శాంతభవరుక్తా
పాథ్యా రాధాధవా!

మ. శ్రుతిమార్గ మ్మ[illegible]గంటి, ధర్మగతికిన్ క్షోభ, మ్మధర్మ
మ్ముప,ద్ధతి కెంతే నెగడున్ బొసంగుతఱి నీధాత్రీస్థలిన్
ధర్మము,ద్ధృతిఁ గావింపఁగ శిష్టరక్షణపరాధీనమ్ము
చిత్తమ్మునన్, ధృతనానాకృతివై జనింతు వెపుడున్
నిక్కంబు రాధాధవా!

మ. ఇల నేరూపము కాదు నీది; జననం బేజీవులం దొంద;
వె, స్థలరన్ నేఱ; వనాది; వాద్యుఁడవు; మధ్యాంతం
బులుం ద్వ్యాప్తినతం,బుల; యారెండును లేనిజాణవు;
సతమ్మున్ గూర్చి రక్షింతు వి,మ్ముల రెంటం బడఁబోని
ధీరులకు శమ్ముల్ సుమ్ము రాధాధవా!

మ. నెఱిఁ జోరీనమునై పవిం గెలువనౌ నెమ్మెన్ నగ్గఱిల్
గోఱలున్, మెఱయం దిగ్గజముం గల్పమునంతమున మ
న్నీర్వాయిం, జాలో, విధిం, బఱచం జాల్పడి ప్రముచ్చి
లించి నిగమవ్రాతంబులం బాఱు నక్కఱటున్ సోమకుఁ
ద్రుంపవే నిగమరక్షాదీక్ష రాధాధవా !

మ. మును మంథానము మందరమ్ము నురగమ్మౌ ద్రాఁడు
గావించి ప్రచ్యునెడన్ వేల్పులు రక్కసుల్ సుధకు,
నచ్చో వార్ధి భూధ్రంబు పేర్చి సంక్షుబ్ధత బ్రుంగ దాని
భవదుర్వ్యంబు కూర్మాకృతిం, దనరం దాలిచి
మోచి మించవె సురేంద్రస్తుత్య, రాధాధవా !

మ. ప్రలయాంభోధిగభీరనీరమున భారంబై కడుం బ్రుంగు
ప్రోఁ, బలుకుల్ పెట్టియు తాత కూర్చిన మహద్బ్రహ్మాండ
భాండంబు వేల్పులమూఁకన్ వెఱపించు కోఱగ
మోపుం జూపఁ గ్రోడంబవై, యలరం జేర్మి సముద్ధ
రించితి హిరణ్యాక్షారి, రాధాధవా !

మ. మునిసర్గంబునకుం గడంగి, స్వతపోభూరిప్రభావంబునం,
గాని దేవర్షిత్ర, సాధుపోషణరతిన్ గూఢంబునై కర్మ
బంధనముల్ వే సడలించి మోక్ష మిడు విజ్ఞానంబు
బోధించి మించిన వేదాంతవనస్థలీహరివి వాసిన్ నీవు
రాధాధవా !

మ. అలర్కా ధర్మకళాధిసర్గమున నుద్యద్వృత్తిమై శాంతి
దాంతులు నీరాగము మున్నుగాఁ గలుగు సన్న్యాస
మ్ములో సద్గుణమ్ములు మానీంద్రయుగాకృతిఁ మివుల
బొల్పుం గాంచి కావించితి,మ్ముల నుగ్రహమ్ము సుమహ
రమ్ము తపమున్ మునిన్నివు రాధాధవా!

మ. అనసూయా స్తనపాయివై తొలుత దత్తాత్రేయనామం
బునం, దనయత్వంబునఁ గ్రాలి యత్రిముని కాత్మజ్ఞాన
సారం, బలర్కనరాధీశసురారిపుత్రులకు వక్కాణించి
యుక్కార్పవే, ఘన మజ్ఞానత్వమ్ము బోధరుచి లోక
మ్మంచు రాధాధవా!

మ. వలిగుబ్బల్, నునుపోయగంపుకను, లభ్రభ్రాంతముఁ
బించువేసలి, తీరైనమొగంబు, ముద్దుమాటల్, నందం
బొప్పకేల్దోయి, నిస్తులరమోత్యారుయుగంబు నొప్ప
భవునిం జోద్యంబుగా మోహాసిం,ధ్వాలఘూర్మిఁ మునిఁ
గించి పర్విడిన మాయారామ, రాధాధవా!

మ. అవతారంబులు దాల్చితీవు శతసంఖ్యాకంబు లన్వా
నమ్మనస్యవికారంబులు నేకరూపము; లోక ప్రశస్తమ్ముగ్రీవ
మ్మునన్, గవినుత్యమ్ము మృగేంద్రమానసమునం
గైకొంటివి మై భక్తత,త్యవనాయత్తము చిత్తవృత్తి
హతదైత్యవ్రాత, రాధాధవా!

మ. తిలకింపం ద్రిదశాద్యు లెల్లను విభూతిన్ సామ్యమే
లేనియట్టులు బ్రహ్మాండకటాహమ్ముం బ్రిదిలి బీటుల్
వ్రోవ మై వెంచి, యొక్కలలిన్ బాదయుగంబునన్
భువనసంఘం బాక్రమింపంగనై, బలి శిక్షించితి నెత్తిపై
నిడి వటూ! పాదంబు, రాధాధవా!

మ. అరయంబో కపచారమ్ముం బిత్రుం దపస్యానిష్ఠు బ్రహ్మి
ష్ఠునిం, బరిమార్పం దొరకొన్న ముక్కడులపై స్వాం
తంబునం గిన్సి నిర్జర! నీ విర్వదియొక్కమాఱు నిహత
క్షాత్రంబు గావింప నుర్వర, నవ్వారిం గుఠారధారం
బొలియింపవ లేదె రాధాధవా!

మ. తమిం బాటచ్చరమానియై యనుంగుకాంతం దాంత
కాంతారమధ్యమునన్ ముచ్చిలిగొంచుం బోయిన
దశాస్యాస్యాటవిన్ వైర్యవార్య మనూనం బమరాద్య
భీతిదము శౌర్యాటోప మేపార స్వీయమహాస్త్రాగ్ని
దహింపవే రఘుకులాగ్ర్యా, యాద్యా, రాధాధవా!

మ. శరదబ్జాహితు గేలిసేసెడు మెయిన్ శ్యామాంబరం
బొప్ప, భాస్వరనీలాభ్రపరీతసానుయుతమౌ ప్రాలేయ
శైలంబురీతి రహిన్ సేవకతాపముల్ దులిచి ప్రీతిన్
సాకవే యాదవప్రాత్కరమున్ స్వాంశవిభిన్నమూర్తి
వయి, భక్తస్తుత్యా, రాధాధవా!

మ. భువి శేషాపరమూర్తి యండ్రు హలినిన్ భూరిప్రభా
వాఢ్యునిన్, భువనోద్ధారచణుం, డనంతుఁడు, యతీ
ట్పూజ్యుండు, ధర్మావన, ప్రవణుం, డాత్తశతావతా
రుఁడు, సురారాధ్యుండు నవ్వాఁడు నౌట విభేద
మ్మల నీకు శేషునకుఁ జూడన్ రాదు రాధాధవా!

మ. కలశోదన్వదభంగభంగతతిరేఖాడోలికాకేలికా, కలనం
గల్మ్రలకల్కితోఁ బొలుచు నాగప్రఖ్యతల్పుండ వీ, వల
భక్తప్రవరావనాభిరతి సందార్ద్రాంగిముంగింట మిం,
చుల మించందగు మేనఁ గూన వయి హాసుం గంటి
రాధాధవా!

మ. పరమాప్తుం డవుకంసరా జలుక నీప్రాణానిలుం గ్రోలు
నిష్ఠురకార్యమ్మున కంప వచ్చిన మహాశూరుల్ తృణా
వర్తముఖ్యారిపుశ్రేష్ఠుల లీలమై గెడపి నీయందే తమిం
జేర్చికొంటి రమావల్లభ! నిగ్రహాత్మకము సూ నీకూర్మి
రాధాధవా!

మ. చెలఁగన్ లాలనపాలనానుసరణాశ్లేషానుసంభాషణా,
దుల నీసన్నిధిఁ బాయఁబోక కృతకృత్యుల్ కా జనిం
గన్న వే,ల్పుల యా వ్రేతలెడందలన్ నెలవులం
బొల్పారునాబాలువెన్నలతోఁ బాటు హరించి కాంచితి
మహానందమ్ము రాధాధవా!

మ. సలువౌ వేణువు రొండి, దాపలిబుజానన్ భక్ష్యచోష్యాది
సం,కలిత మ్మోదనశిక్యముం, గళ కయిన్, గాల్గోయి
నిన్ గజ్జియల్, జెలువారన్ యమునాధునీవనిని నోలిం
గాచి తీవాలమం,దల గోపాలురతోడఁ గూడి
త్రిజగత్కల్యాణ, రాధాధవా!

శా. ఆలోనీమహిమం గనం గుతుకివై యంభోజసంభూతుఁ
డ,య్యాలం గ్రేఁపుల గోపడింభకుల మాయంబుం
బొనర్పంగ నీ వాలోకించి ధరించి యత్తఱిన యాయా
రూపముల్ వల్లెలోఁ, బాళిం బుచ్చితి వత్సర మ్మొకఁ
డజప్రస్తుత్యా, రాధాధవా!

మ. తనయాగమ్మున కడ్డువల్కి ధరణీధ్రశ్రేష్ఠముం గొల్చి
పొ,ల్చినకిన్కం గురియింపఁ బొల్పడ సునాసీరుండు
ఱాల్వాన తా, దినముల్ మూడును నాల్గు, నుద్ధృత
ధరిత్రీధ్రుండవై ప్రోవవే, తనరం గూర్మి సగోగణమ్ము
వ్రజబృంద మ్మీవు రాధాధవా!

మ. విష మాశీవిషజాతికుంట త్వదభిప్రేతంబ, యట్లయ్యు,
ని,ర్విషుఁ గావించితి కాళియాహి స్వజనాపేక్షీయమా
నార్కజా,విషముం బావనమాచరించుపనికై; స్వీయాను
రక్షం దటంకషమా నీకృప పక్షపాతికద భక్తస్వాంత,
రాధాధవా!

మ. చెలువై ముగ్గినచంద్రచంద్రికలచేఁ జిత్తమ్ము మొత్తమ్ము
ప్రము,చ్చిలికొంపోవు త్రియామలం దినసుతాశీతానిలా
నీతమౌ, జలబిందూత్కర మూడ్వఁ జెమ్మట నిషత్సా
రమ్ముఁ గ్రోలించుచున్, జలజాతాస్యల, లీలఁ దేలితివి
రాసక్రీడ రాధాధవా !

మ. కనఁ గంసక్రియమాణయాగమునకుం గైకొంచు ని
న్నేఁగు పా,వనుఁ డక్రూరునకుం గళిందతనుజావారిన్
నెఱిన్ మీఁటి చూపిన యింద్రోపలనీలమై శ్రుతిశిరో
వేద్యంబునై పొల్చు నీ,ఘనరూపమ్మును గాంచి మించు
నెపు డీకన్దోయి రాధాధవా !

మ. అల నక్రూరపురోగతుండవయి, తాలాంకద్వితీయుం
డవై, జలదాభాపఘనుండవై, ఘనుఁడవై, సౌందర్య
వారాశివై, కలభంబుం బురుడించి మించు నడలన్
గంసుం గనంబోవు నీ,వలనుం గన్న మధుప్రజల్ సలిపి
రేభాగ్యంబు రాధాధవా !

మ. ఛలయాగాయతనమ్ముద్వారమునఁ ద్వత్సంహారకర్మాతి
ని,శ్చలతన్ మావటివాని కానయిడి కంసస్థాపితమ్మౌ
మహా,జ్జలజాపీడము నాగమున్ సహాలివై శౌర్యం
బవార్యంబుగా, నిలఁ గూల్పం దొరకొన్న నీకు కెలసం
బింతింతె ? రాధాధవా !

మ. అవనీభారనివారకుండవు, స్వమాయాస్వీకృతానేక
మూ, ర్తివి సర్గస్థితినాశహేతుఁడవు, గౌరీవల్లభాజప్రసం,
స్తవనీయుండ, వవార్యవీర్యుఁడవు, కంసప్రేరితుల్
ముష్టికాద్యవిరోధుల్ కన నీకు లెక్కయొకో ప్రమందిం
పంగ రాధాధవా!

మ. కినుకం దగ్గరి కొంగ సాళువముభంగిన్ గూలఁగాఁ
దన్ని ధా,రుణిన్, మాయింపఁగ నిన్ మదిం దలఁచు
క్రూరుం గంసునిం జంపి నీ, ఘనతేజమ్మునఁ జేర్చికొం
టివి కనంగా నేర్తు రేరీతి నేని నొనర్పన్ భవదీయ సం
స్మరణమున్ నీ ప్రాపు రాధాధవా!

మ. పరిహాసంబున, మచ్చరంబుకలిమిన్, వైరంబునన్,
గామత,త్పరతన్, నిర్మలభక్తియుక్తి, నెటు, లేఫక్కిన్
భవన్నామసం,స్మరణవ్యాపృతి నేమఱుంజనని యా
సత్పూరుషుల్ గాంత్రు సు,స్థిరతన్ ధామ మనంతమున్
భవపయోధిన్ దాఁటి రాధాధవా!

మ. మతజాత్యాదివివక్ష, దీక్ష, విధి, భామాపుంవిభేదంబు,
తె,న్ను, తమిస్రాదినకాలకల్పన, వయోన్యూనాధిక
త్వమ్ము నో,పతితోద్ధారక! భావనిర్ణయము త్వద్భ
వ్యాంఘ్రిపాథోరుహ,ద్వితయోపాస్తికి సున్న; యున్న
స్మృతియే వేయేల రాధాధవా!

మ. పవిధారాహతికిన్ జలింపఁడు, నభస్వద్ధాటిఁ బాటింపఁ
బోఁడు, వికార మ్మొనయండు వహ్నిఁ గని, గోడుం
గాంచఁడున్ భాస్కరచ్ఛవికిన్, భీతిలఁ డస్త్రశస్త్ర
తతికిన్ స్వాంతంబునన్ నీకుపాదవనజద్వయిఁ గొల్చి
పొల్చుత్రిజగద్వంద్యుండు రాధాధవా!

మ. హరి బ్రాహ్మమ్ముపదమ్ము, నింద్రపదవిన్, భూతేశ
ధామ, మ్మహస్కరధిష్ణ్యమ్ము, సమస్తలోకనికరేశ
త్వమ్ము, సర్వమ్మునన్, నిరతమ్మున్ దిలకించి తాఁ
దృణముకంటెం దేల్కగాఁ బొల్చు నీచరణాంభోరుహ
దత్తచిత్తుఁడు పరేశస్తుత్య, రాధాధవా!

మ. తెలియన్ రానిభవన్మహామహిమమున్ ధీగీష్పతుల్
వేదవే, త్తలకూర్మిం దెలియంగ నైయితరచింతాదూరులై
త్వచ్ఛరణ్యులమై నిన్భజియించు సజ్జనులదా యోగ
మ్ముక్షేమమ్ము నిమ్ముల నీవే వహియించికొందు కరు
ణాంభోరాశి, రాధాధవా!

మ. సమలోష్టాశ్మసువర్ణరత్నచయుఁ, డశ్రాంతార్జవోర్జస్వి,
నిర్మమతాహంకృతి, నిత్యతృప్తుఁడు, నిరారంభుండు,
నీరాగుఁడున్, క్షమి, యోగీంద్రుఁడు, సర్వభూతహితుఁ
డున్, సౌమ్యుండు, త్వయ్యర్పితాత్మమనస్కుం డొక
రుండ నీకుఁ బ్రియుఁడున్ ధన్యుండు రాధాధవా!

మ. అతిఘోరమ్ము భవమ్ము పేరిటి తపార్కాంశ్వగ్నిదుర్వా
రతా, పతితన్ దూరముసేయు నీదుననుకంపాసారమా
సారమం, దతిలిప్సన్ దడియంగనేఱక యదీయస్వాంత
కేదారమం, దతులంబై దృఢభక్తిబీజము ప్రరోహ
మ్మెత్తు రాధాధవా!

మ. వలనుం, దేజము, నామరూపవిభవప్రాచుర్యమున్,
వీర్యమున్, గలిమిన్, శీలము, వాసమున్, గుణము,
లాకారప్రకారంబు, దో,ర్బలమున్, సర్వము తావక
మ్మెఱిఁగి యారాధించు ధన్యాత్ముఁ డుజ్జ్వలుఁడై
నీదగుకూర్మి పేర్మి నమృతత్వ మ్మొందు రాధాధవా!

మ. అల సర్గస్థితినాశకారణము, వేద్యంబున్, సుగూఢంబు,
నీ,కలరూపుం దెలియంగ నేర్చి ముదముం గైకొన్నవా
రెన్న దేవలుఁడున్, వ్యాసుఁడు, నారదుం, డసితుఁ
డున్, వ్యాసాత్మజుం డాదిగాఁ,గల పుణ్యాత్ములు నల్వు
రేవుర కదా కంజాక్ష, రాధాధవా!

మ. నడువన్ నేర్తువు వేగ, పాదములు కానన్ రావు;
కావింతు నే,ర్పడరన్ గృత్యములన్నిఁ, సున్న యనువౌ
హస్తమ్ము; లేనాఁడుఁ గ,న్పడరా, వెల్లెడ నిండియుం
దువు; ధ్వనిన్ స్వల్పం బనల్పంబయ్యేఁ గడఁకన్ విం
దువు, లేవు వీను, లకలంకా, నీవు రాధాధవా!

మ. అడుగుల్ సాచి తనంతఁ దాఁ గమఠ మాత్మాంగంబు
నందుం దుదిన్, ముడువం బొల్పడి పొల్చుమచ్చున
జగత్పుంజంబు గల్పింతు, తోఁడ్పడి పోషింతు, వడం
తు; వింతయును లీలం దేలఁగాఁగాదె, యీ,సడకన్
జూపితి మున్ను కూర్మమయి యానందాత్మ రాధాధవా!

మ. అరయంగా దిది కాదు కాదనుచు మూర్తామూర్తముల్
సర్వముల్, వరవాక్యమ్ములు త్రోసిపుచ్చి చని చాలన్
దూర మచ్చో నహ,స్కరసాహస్రకరాతిగమ్ము కని
తేజఃపుంజముం బల్కె నీ,పరతత్త్వం బది యంచు,
నోం డరయనోపంబోమి రాధాధవా!

మ. అలఘుం డిత్థజగత్ప్రకాశకుఁడు తిగ్మాంశుం, డమర్త్య
క్షుధా,కలనం దీర్చు సుధామయూఖుఁడును, నక్షత్రాళి
సౌదామినుల్, జ్వాలనుండున్, దులలేని నీదుఘన తేజ
స్స్ఫూర్తి మోలన్ సము,జ్జ్వలుఁ డాదిత్యుని చెంత దీప
కళికల్ సత్యంబు రాధాధవా!

మ. పణముల్ దుస్సహముల్ సెలంగ భవదవ్యాజస్వరూ
పాదిరూ,పణకార్యమ్మునకుం గడంగి యొగి వాక్స్వాం
తంబులున్ రెండుఁదా, మణుమాత్రమ్ముఁ ద్యజింపఁబో
కరసి పారావాప్తిదూరమ్ములై, యణఁగన్ గర్వము
తొంటి తెన్నుగొనె మాయాదూర, రాధాధవా!

మ. సమతాపాస్తము, సర్వహృత్కుహరవాసస్ఫీతముఁ,
బూత, మతీమనోఽగోచర, మాదిబీజము, సుహృద్గే
యంబు, ధ్యేయంబు, భూతమహేశిత్వవిశిష్ట, మిష్టజన
తాతాపప్రణాశ, మ్మనంతము, వేదాంతవచోవి
మృగ్యము, భవత్తత్వంబు, రాధాధవా!

మ. ఎనయుం దారము రత్నహారములయం దేరీతి, నారీతి
తోఁప ననుస్యూతమ యయ్యు జాగరముఖావస్థా విశే
షంబులం, దనయంబంటక తానుపాధిఁ దగు నుద్యద్భక్తి
యోగీంద్రబృందనితాంతప్రణుతమ్మయై పరము నీ
తత్త్వమ్ము రాధాధవా!

మ. అవధిం గూరిచి స్వీయశిష్యులకు శ్రుత్యన్తార్థబోధావిధా
ప్రవణుల్ "సుమ్ము త్రయీతనూగతము తత్త్వమ్మేను;
నే నద్దియే, యనుచుఁ నిక్క" మటంచు మించు శ్రుతి
వాక్యాళిం బ్రబోధించుచుం, బ్రదవధానమ్మెన నీను
తత్త్వము సుగోప్య మ్మెప్డు రాధాధవా!

మ. అగవీమానసగోచర, మ్మనుపమ, మ్మజ్ఞాత, మత్యుజ్జ్వల
మ్మగుణ, మ్మాద్య, మనాదిమధ్యనిధన, మ్మద్వైత,
మాదిత్యమ,ధ్యగ, మవ్యాహత, మాదిభూత, మఖిలా
ధార, మ్మనాధార, మాశుగ, మస్థానము, నీను తత్త్వ
మరయఁ శుద్ధంబు రాధాధవా!

మ. తనరం గోరికి కూర్చి ఖాద్యమవు నేతద్విశ్వవిశ్వంబు,
నో,య్యాన నద్దాన ననుప్రవిష్టమయి కోశాఖ్యాన
మానూక డా,గిననీతత్త్వము యుక్తిఘాతనుల వెల్కిం
దీసి యూసింత్రు తా,ర్గోన బియ్యమ్మటు లాగమజ్ఞులు
బృహద్రూపాఢ్య, రాధాధవా !

శా. నీతత్త్వమ్ముభయమ్ముకల్మి ననుచున్ నీరేజమిత్రుండు,
నా,శీతాంశుండును; మండు నగ్గి; వడి వర్షించుం బయో
దంబులున్; వాతం బాగక వీచుచుండు; మెఱయున్
నక్షత్రముల్; పాఱుం బా,రాత్రిక్రాంతియు లేక తోయధు
లమేయస్థైర్య, రాధాధవా !

మ. విషమంబుల్ విషయార్థపద్ధతుల సుస్వేచ్ఛాగతిం బాఱు
దు,ర్విషయాక్షంబుల పేరి వారువముల్ వేగన్ నివా
రించి పూ,రుషపంచాస్యులు కట్టివైతురు మనోరూపమ్ము
పాశమ్మునన్, విషమాక్షౌర్చ్యము తత్త్వశంకువునం
బూన్కిం బట్టి రాధాధవా !

మ. అమలమ్మున్, మలనాశకమ్ము, పరమున్, సాకార,
మాకారశూ,న్యము, దూరస్థ, మదూరసంస్థము, ఘన,
మ్మజ్ఞేయమున్, జ్ఞేయ, మా,ద్యము, సూక్ష్మమ్ము,
నసూక్ష్మ, ముచ్ఛ్రితము, విశ్వాంతస్థమ్ముం, దద్విభి,
న్నము తత్త్వమ్ము నెఱుంగువార లభవుల్ నాగార్చ్యా,
రాధాధవా !

మ. తెలియన్నేరిచి యద్వితీయమవు నీదివ్యమ్ము తత్త్వమ్ము
వ, గ్గిలుభవ్యాత్ముఁడెవేళనేఁ జులుప నేదేకార్యముగ
దత్ఫలం,బులు పాపంబులు పున్నెముల్ పెరుకఁబోవుగ
వానిలోమమ్మ, యి,మ్ములలేకున్కిని గర్తృభోక్తృ
మతియే భూమాఖ్య, రాఘాధవా!

మ. పరమ, మ్మాద్యము, చిద్ఘన, మ్మమలమా బ్రహ్మ
మ్మదొక్కండ భా,స్వరతగ విశ్వతనుత్వయుక్తిఁ బర
రూపప్రస్ఫురితిగ శుక్తిమా,దిరి నజ్ఞత్వసమావృతమ్మయి
కనుగ; దీపింపఁ దజ్ఞానమే, స్థిరమై క్రాలును విశ్వమ
వ్యయము, తచ్ఛేషమ్ము రాఘాధవా!

మ. కలలం గన్నుల కగ్గమై నమయు మేఘంబుల్, తటిత్తుల్,
పయో,ధు, లిభంబుల్, పుటభేదనంబులు, జగత్తుల్
జాతముల్, జీవనంబులు, గేహంబులు, పుత్త్రమిత్త్రులు,
ధనంబుల్, ధాన్యముల్, నిక్క; ము,జ్జ్వల మద్వైతము,
శాశ్వతమ్ము పరతత్త్వమ్మొండె రాఘాధవా!

మ. నిను నవ్యాకృతు, నామహీను, నమలుగ, నీరూపునిగ,
జ్ఞానరూ,పునిగాఁ దెల్పినవేదవాక్య మదియే పొల్పా
రగాఁదెల్పిపొ,ల్చు ననేకాంఘ్రికరోరుమ స్తకవిభాసుగ,
భాసురాంగుగ, గన,ద్వనమాలాన్వితుఁగాఁగఁ గాం
చదొ విరుద్ధత్వంబు రాఘాధవా!

మ. వనమాలాధరు, శంఖచక్రయుతు, శ్రీవత్సాంకునిన్,
గంబుకంఠునిఁ, బీతాంబరు, శంబరాంతకసమానున్,
మానినీమోహనున్, వనజాతాక్షు స్వపక్షరక్షణచణున్
భావించి కీర్తించు సజ్జను లొందంగలవా రవారిఁ
బరమైశ్వర్యంబు రాఘాధవా!

మ. భువి నుత్తుంగతరంగభంగతరళంబుల్ భోగముల్
భాగ్యముల్, పవనోద్ధూతశతాంగకేతుపటలోలంబుల్
శరీరంబు, లట్లవుటం దామ యెఱింగియు న్వినియు
నేలా మూఢులై కాంచఁబోరు విరక్తిన్ నరు లాజ
వంజవసుదూరుల్ కాఁగ రాఘాధవా!

మ. తనరం బ్రాగ్గిరిస్వస్తికావదముమధ్యం గ్రాలువేళం
ద్రయీతనుఁ డింటన్ సమపక్వ మోగిరమ యాతం
డస్తశైలంబుదా,పునకుం బోయెననంతలోఁ జెనుడు,
తత్సృష్టంబు దేహంబు ని,ల్చు నెటుల్ శాశ్వతమై?
జనుల్ తలఁప రీచొప్పు రాఘాధవా!

మ. చనుపై సర్వాఘు నట్టిలోఁగొనెడు దుస్సాలావృకప్రాయ
లం,గనలన్ నమ్మి సత మ్మవారికులుకుంగాఁగిళ్ల పేరింటి
చి,చ్చున భ్రష్టాత్ముఁడు కాలఁ గాయ మటు చచ్చుం
గాని కార్చిచ్చుఁబోలిన సంసారము నార్చు నీపదము
జోలిం బోఁడు రాఘాధవా!

మ. స్థిరతాదూరము,మాంసశోణితయుక్తశ్వేదప్రదుష్టంబు దు,ర్భరముఁ, హేయము, కాయముం బెరసి మర్త్య వ్రాత మేలా సుదు, స్తరసంసారసముద్రతారక, మసత్తాపప్రణాశంబు, సు,స్థిరమా కర్జము కూళయై చనదు సాధింపంగ రాధాధవా!

మ. నివసింపఁ గిరికందరంబు, లభిమానింపఁ మృగవ్రాతముల్, పవళింపఁ సమముల్ దృషత్తులు, భుజింపం గందమూలంబు, లా,న విశుద్ధంబు ఝరాంబు, వృత్తికయి కాంతారంబులుఁ లేవొకో, భువి నేలా గృహకూపమందుఁ బడి బాముల్ గాంచ రాధాధవా!

మ. భవకాంతారముమధ్యమందు స్వవరీవారప్రలాపంబు పేర్దవువ్యాధాగ్ర్యుననూనగానవిధిచే నాకృష్టచిత్తమ్మునఁ, జవ మొప్పం జని రాగవాగురి విలగ్నంబై మృతిం గాంచు ది,క్కెవరుఁ లేమి నెచోట మర్త్యమృగ మెంతేఁ, గుంది రాధాధవా!

మ. పరఁగఁ మత్తిలి మోహనామకసురాపానంబునఁ, లోలుఁడై, తరుణీభూతగృహీతుఁడై, సుతసుతాతండాళి సందష్టుఁడై, సరణోర్వీరుహ మెక్కి- సుర్విషయసంజ్ఞమ్మైన శాఖాతతిఁ, దిరుగంబూనిన మానుషప్లవగుఁ డార్తిం గూలు రాధాధవా!

మ. పోరి మత్తాంధతమమ్ము గ్రమ్మి నయనమ్ముల్ గానరా
కేడ్చున, త్తరిఁ గామాదిరిపుల్ వివేకమనువిత్తమ్మెల్లఁ
గొంపోవ వం,దురుచుర్ మూఢుఁడు పోయి పోయి
యటు లెందో కూలు సంసారభీ,కరకూపమ్మునఁ, గాని
ముక్తిపథముం గానండు రాధాధవా!

మ. చరణద్వంద్వము నెత్తి నెత్తిపయిఁ దాచం బూనినన్
మానఁబో,నరితిన్ మోహపుత్రాటఁ గట్టువడి పాయం
బోక వెన్నాడు చే,పరస్త్రీ పేరిటియూడుగాడిదకు లోనై
గోడులం గుడ్చుని,న్నరబాలేయము కాంచ నేరుచునె
ధన్యత్వమ్ము రాధాధవా!

మ. క్షమ జన్మించిననాఁడునాఁగఁ బ్రబలాశాపీడితుండై
యజ,స్రము సత్యాల్పణకిల్బిషాచరణదీక్షాదక్షతన్ బూ
రుషా,ర్థము లగ్గింబడఁద్రోసి వీసము నసారంబైన సం
సారమం,దు మమత్వం బెడఁబాయఁబోని జనుఁ డొం
దుం జేటు రాధాధవా!

మ. పోరిఁ గుక్షింభరణార్థచిత్తమున రేపున్ మాపునందందు
సం,చరణమ్మాచరియించి డస్సి యిలుపంచం జేరుచో
నొక్కమా,ర్గరువన్ నందనదందశ్లోకములు పెన్కొత్తిం
బడంబూనుఁగా,క రవంతేని విరక్తి నల్పుఁ డెపుడుం
గాంచండు రాధాధవా!

మ. సరవిన్ స్వోదరపూరణాభిరతి నష్టభ్రష్టుఁడై కష్టముల్,
పెరయంగానయి పారమార్థికముఁ జోలింబోక రాకాసినై
స్థిరమైఁ దాల్చినలాభ మింత కనునే శింఘాణభుక్తిన్
నిజో,దరమున్ నింపుచు మేనుపెంచి మనదే ధ్వాం
క్షంబు రాఘాధవా!

మ. ధరణిన్ దుర్లభమైన మానుషజనిన్ దాఁ గాంచి
చంచద్గతిన్, బురుషుండై కలజ్ఞానవైభవము వమ్ముం
జేసి నిత్యమ్ముఁ గా,సరమట్టుల్ పరియించు చన్నిటఁ
బ్రణాశమ్ముం దుమందుంను నీ,చరణంబుల్ శరణొందఁ
బోక యెటు మోక్షమ్ముందు రాఘాధవా!

మ. తెలియంజాలమి బాలభావమున, విద్దేల్ నేర్వ నాఁపైని,
నా,వల బిబ్బోకవతీవిలోలతను, నాఁపై సంసృతి న్మని
నిన్, దలఁపంబోక కృతాంతకాసరగళోద్ఘంటానినా
దంబు తన్, కలఁతంబెట్టుతఱిం దోఁజంకొను నె
ప్రొక్కుం గూళ రాఘాధవా!

మ. ఒకవంకం బవనాతిపిత్తగతి, శ్లేష్మా! దేకవాగ్రోధ, మిం
కొకవంకన్ దనుజాదిరోదనరవ, మ్మొండొక్క చక్కిన్
గృతాం,తకభృత్యౌఘముతర్జనమ్ము లడరం దా నట్టిచో
నీల్గున, బ్రాకయింతేని లభించునే యదను ని న్నూ
హింప రాఘాధవా!

మ. గలసీమం దమభీమపాశములఁ గిన్కన్ గ్రుచ్చి బంధించి
యా,ర్పులతోఁ బాశిభటాళి ప్రాణపవనంబుం దీయు
చున్నప్డు, తో,య్యాలి పైనింబడి యా స్త్రీప్రాస్తులకు
హాహారావముల్ సేయున, ప్డలఁతుల్ గొల్వంగలారె
నీదుమ్మృదుపాదాబ్జంబు రాఘాధవా!

మ. వెనువెంటంబడి రానపారము మదావేశమ్ముసం దా
మొన,ర్చినదుష్కర్మఫలమ్ము క్రమ్ముకొనుచున్ బ్రేతా
ధిరాడ్ధామ మొ,య్యనఁ జేరంజని మర్త్యులాడఁ గను
నాయానారకమ్ముల్ దలం,చిన భీతిం బ్రిదులంగఁబో
దెవనిదాచి త్తమ్ము రాఘాధవా!

మ. మును తాఁ బెట్టినహింసఁ గన్న నిఖిలంబుల్ జీవముల్
తీర్చికో, ఘనవైరమ్ము కరాళవృత్తి నచటం గాల్పెట్టుచే
హద్దుగా, ననువౌ చేష్టలఁ జుట్టుముట్టి యొకపై యం
గంబులం జీల్చున,ప్డు నరుల్ గాంచెదుగోడుఁ జూడ
నెవఁ డోపుం గంట రాఘాధవా!

మ. అలుకన్ మత్తిలి కాలకింకరులు హస్తాంఘ్రిద్వయ
మ్మంటగ,ట్టి లలిన్ దెల్పుచుఁ బూర్వకర్మములు వీటిం
దాఁటి బాహ్యస్థలిన్ శిలపై నంజుడుకంపులీను నెడ మేన్
భిన్నమ్ము భిన్నమ్ముగాఁ, జలుపం బొల్పడఁ గల్గుక స్తిఁ
గలరే సైపంగ రాఘాధవా!

మ. నెనరుం బూనక యింత యంతకభటుల్ నిర్వేలహా
ర్షంబు మై,కొన మైకట్లలమంటఁ గాచిన యయోఘో
రమ్ము భాండాంతర,మ్మునఁ బైఁగ్రిందవు తైలమంగు
వడియమ్ముల్ వ్రాలె వేయించువేళ నరుల్ పాపులు
గాంచుతాప మది యల్పం బౌనె రాధాధవా!

మ. తలక్రిందౌనటు లేర్చ భూగతబృహద్భాష్పోర్చ్చ లం
గమ్ము ద్రో,తలముం దాకెసు మ్రానికొమ్మలకుఁ బాద
ద్వంద్వముం గట్టి ము,ల్కు లవారల్ మెయి చిల్లువ్రా
విడచుచోఁ గుడ్వంగనా గోరముల్, గల్గనెనం బగ
వారికేనిఁ గలుగంగానీకు రాధాధవా!

మ. మలమూత్రాదికసంకుల, మ్మసమ, మస్మార్య, మ్మవా
ర్యమ్ము, పు,ర్వుల కిరవై చనుసంధకూపమునఁ దద్భ
క్తిఁ లయంబంద వా,రలచేఁ బాతితుఁడైన మానిసి
సహస్రంబుల్ సమల్ దాఁక మ,ర్బలతం బొందు బెడంద
లెన్నఁడుఁ గృపఁ రానీకు రాధాధవా!

శా. ఎన్నే నేడులు పాపిలోకమున నెన్నే తెన్నుల న్నారకా,
లెన్నే నొందిన నొందవచ్చు, నవు నెంతేఁ గుందినన్
గుంద నా,పన్నుండై, కనరా దేవాఁడు నెపుడున్
స్వప్నంబునఁగాని, య,న్నన్నా! గర్భము పేరినారక
మసహ్య మ్మెన్న రాధాధవా!

మ. తెరువుం గానక వెల్వడన్, ముడివడన్ దేహంబు
సర్వం, బధః,శిర మొప్పారఁగ, స్నాయుబద్ధుఁడయి,
పెన్జిల్లుల్వడఁగా నొడల్ గరువం బొల్పడఁ బెంటనున్న
పురువుల్, కన్దోయి నీర్నింప, దుర్భరగర్భమ్మున స్రుగ్గి
మ్రుగ్గుఁ దనుభృద్వ్రాతంబు రాధాధవా!

మ. తమిమై గర్భముఁ దాల్చి పొల్చు చెలి యేదం దిన్న
యాయాపదార్థములం గల్గిన యుష్ణాకారములసంతాప
మ్మునన్ మేను భగ్గుమనన్ సైపఁగలేక యేకరణి
సేకూరున్ వెలింగాంచుటంచు మదిం గొందలమందు
నిచ్చ లతఁ డేడ్చుం బెల్లు రాధాధవా!

మ. తివురన్ మాసము లొక్కఁ డెన్మిదియుఁ బూర్తిం జెంది
తత్రత్యవాత్యావిధిన్ వెల్వడి వాఁడు మూర్ఛఁ గని
మాయన్ జ్ఞానసంపత్తి కూడి వడిం బోసిన నీటివేడి
మిని దెల్వొంగాంచి బిట్టేడ్చు నిట్టివిధిం గూర్చితె దేవ!
యంచు వగ రెట్టింపంగ రాధాధవా!

మ. చినుఁగుంబొత్తులఁ గూలనైవఁబడి స్త్రీ చేఁ గుక్కిమం
చాన మత్కుణముల్ చీమలు దోమలుం గొఱుకఁ
జేతుల్ రామి వారింప వాకొనుభాగ్యమ్మును లేమి
నార్తిఁ గను వాకోరానిచందమ్మునం, దనదా భావి
విధంబు దెల్పుగతి దైన్య మ్మొప్ప రాధాధవా!

మ. సమవాతావరణమ్ముకల్మి, ననరిష్టప్రాప్తి జీవమ్ము
దాల్చు, మహాభాగ్యము గల్గుచోఁ దనదురోజంబుచ్చు
చున్ వీట బాల్యము నజ్ఞానము వేర్మి దాఁటి యవలన్
లభ్యంబ యౌనట్టి చంద్రమునన్ నేరుచు విద్ధ, లేని
యెడ శూన్య మ్మద్ది రాధాధవా!

మ. పోడసూపన్ నవయౌవనాంకురము లంభోజాక్షి
నొక్కర్తుఁ దోడ్పడఁ గొంచున్ ననవింటివాని పెను
చివ్వన్ మున్గి యాతెన్నునన్, గముపన్ గొన్నిసమల్
శమింప నవుటం గాయంబునం బల్మి మై ముకుతల్వాగ
నవాఁకు వార్ధకపుకంపుం జెందు రాధాధవా!

మ. బలవద్వ్యాధిపరీతదేహుఁడయి దుర్వారమ్ము శోకమ్ము
నన్, విలపింపందోడరన్ సతీసుతులు మేన్ వే పిడి
యాయాఫలంబులు పాపాదులకున్ భుజించి మఱలన్
బుట్టున్ భువిన్ గిట్టు నిట్టులు సంసారముచక్రమందుఁ
బడుఁ బాటుల్ దేహి రాధాధవా!

మ. తెలియన్నేరిచిఘోరసంసృతిమహార్తిస్ఫూర్తినశ్రాంత
మున్ జలజాతోద్భవ శైలజాధవ సురేట్సంపూజ్యమై
ప్రాజ్యము, శ్రీలతాంగీ మృదుహస్తసంగ్రహణ మర్థిం
గూర్చు నీపాదసేవ లలిన్ సంసృతి దాఁటువారు ఘను
లబ్జాతాక్ష రాధాధవా!

మ. భవచక్రక్రకచావిదీర్ణ, మురుతాపజ్వాలసంతప్తమున్,
వివిధాధివ్యధితమ్ము, మోహమదనిర్వేలమ్ము, లోల,
మ్మఘా,త్యవధానమ్ము, విపన్నముం, ద్వదురుమాయా
ఢాకినీమర్దిత, మ్మవు లోక మ్మఖిలమ్ము ప్రోవు మనుకం
పాంభోధి, రాధాధవా !

మ. శ్రవణీయస్వచరిత్ర, ధాతృదివిజేంద్రద్యుమ్మధవర్యాత్మ
జా,ధవసంస్తోత్రవిధానపాత్ర, కలుషధ్వాంతాబ్జమిత్రా,
మహా,ద్భవపాథోనిధియానపాత్ర,నవవార్వాహోల్లసద్గా
త్ర, దా,నవరాడ్వంశలతాలవిత్ర, కొనుమా నాజోత
రాధాధవా !

* * *

మ. కలిఁ గంజప్రభవుల్, గుణమ్ములును, మేఘద్వార
బాణమ్ములన్, నలువౌ నీబహుధాన్యవర్షముతవన్
సవ్యస్థితిం గృప్తమిద్ధ లలిన్ ప్రీతిసమేతుఁడై చదువ
భక్తిజ్ఞానవైరాగ్యసిద్ధుల నొస్పౌరును బూనుఘుండు
త్రిదశస్తోమార్చ్య, రాధాధవా !

* * *

సమాప్తము.

## ఈ రచయితల మరికొన్ని పుస్తకములు:

### అచ్చయినవి

౧ ప్రణయగీతాలు

౨ పుష్పమాల (ఖండకావ్యము)

౩ పుష్పబాణవిలాసము (అనువాదము)

౪ బాష్పకణములు (దేశీయనాయకస్మృతి)

౫ ఆత్మత్యాగి (జతీంద్రదాసు జీవితము. ప్రస్తుతము అచ్చులోలేదు)

౬ కవుఁగిలి (ద్విపద. ప్రేమకథ)

౭ శ్రీమద్భాగవత మాహాత్మ్యము (౪ ఆశ్వాసములు)

౮ శ్రీ దయానందతిమిరభాస్కరము (ప్రథమభాగము) (సత్యార్థ ప్రకాశ ఖండనము)

### అచ్చుకానున్నవి

౧ శ్రీ దయానందతిమిరభాస్కరము (౩ భాగములు)

౨ పరకాయప్రవేశము (౩ ఆశ్వాసములు)

౩ కాలభాగవతము (ద్వితీయస్కంధము)

౪ ఆంధ్రప్రతిభ (ఖండకావ్యము)

౫ భద్రావత్యభ్యుదయము (హాస్యప్రబంధము)

౬ గణేశపురాణము

౭ దయానందమిథ్యార్థప్రకాశము

౮ పురాణములు

౯ శ్రీ వైకుంఠనాథ స్తవః

౧౦ శ్రీ రామలింగేశ్వర స్తవః

౧౧ శ్రీ శివవింశతి